# నేతాజీ'స్ గోల్డు



పై ఫోటో జపాన్ లో ని రెంకోజీ టెంపుల్ లో నేతాజీ  అస్థికలపై నిర్మింపబడిన స్మారక చిహ్నాము

---

నేతాజీ గారి నిధులు - మరణము -అస్తికలు దాని పై వివాదాలు గురించి

-----------------------------------------------------------------------------------

విషయ సేకరణ - వారణాసి శ్రీ రామ కృష్ణ

**-----------------------------------------------------------------**

బోసు గారు ఇండియన్ నేషనల్ ఆర్మీ **{INA }** స్థాపించారు . ఈ సేనను నడపటానికి వారు జపాన్ యొక్క సైనిక సహకారాన్ని పొందారు . కానీ ఇండియన్ నేషనల్ ఆర్మీ ని నడపటానికి అవసరమైన నిధులకోసం - అయన జపాన్ మీద ఆధార పడదలుచుకోలేదు . అందువల్ల **INA** ని బలపరిచే వారినుండి విరాళాలు సేకరించాడు . . ఎక్కడ అయినా సరే చెల్లుబాటుకు వీలువున్నది బంగారమే కాబట్టి విరాళాల సేకరణలో బంగారము స్వీకరించటానికి ఎక్కువ ప్రాధాన్యము ఇవ్వబడింది .

"నేతాజీ " ఆజాద్ హింద్ పేరిట ఒక ప్రవాస భారత ప్రభుత్వాన్ని ఏర్పరిచారు. నేతాజీ ఫండ్ కమిటీ అనేది ఈ ప్రభుత్వమూ తరఫున విరాళాలు సేకరించి - ఆనిధులను నేతాజీ గారి ప్రచ్ఛన్న ప్రభుత్వములో వున్న రెవిన్యూ మంత్రిత్వ శాఖకు అందచేసేది .

రెండో ప్రపంచ యుద్ధములో - జపాన్ లొంగిపోయింది .దీనితో రెండో ప్రంపంచ యుద్ధము కూడా ముగిసింది ..**{ Japan's surrender ended World War II, at 8 am on August 16, 1945 }** దీనితో జపాన్ దేశం , బోసు గారికి చేసే సైనిక సాయం -- లేకుండా పోయింది

ఇహ జపాన్ లొంగి పోయే సమయానికి బోసు గారు సింగపూర్ లో వున్నారు . అయన అక్కడనుండి - బాంగ్ కాక్ లో వుండే "ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్ " **{ ILL }** జనరల్ సెక్రటరీ అయినా దేవనాథ్ దాస్ ఆనే తన అనుచరునికి ఒక టెలి గ్రాము పంపారు . " మనము ఇండియన్ నేషనల్ ఆర్మీ కోసం సేకరించిన నిధులను ఒక రహస్య ప్రదేశములో జాగర్తగా దాచి వుంచవలెను " అని టెలిగ్రామ్ సారము. అప్పుడు దేవనాథ్ దాస్ ఆనిధులను . బ్యాంకాక్ లో ని బోసుగారి నివాసానికి దగ్గరలో నే వున్న **INA** వారి **military police** భవనంలోకి చేర్చారు

సింగ పూర్ నుండి బ్యాంగ్ కాక్ వచ్చిన వెంటనే, నేతాజీ ఈ నిధి దెగ్గరకు వెళ్లారు . తన సైన్యానికి సిబ్బందికి మూడు నెలల జీతం ముందుగా చెల్లించ వలసినది అని చెప్పి - ఆ నిధి నుండి కొంత మొత్తాన్ని ఇచ్చి వేశారు .

యుద్ధము లో జపాన్ లొంగి పోయింది కానీ బోసుగారు లొంగి పోలేదు కదా ? . బోసుగారు తన స్వతంత్ర పోరాటాన్ని కొనసాగించ దలిచారు . అందువల్ల ఆయన తన అనుచరులను సమావేశపరిచి " ఎక్కడికి వెళ్లుతున్నానో తెలియని ప్రాంతానికి వెడుతున్నాను " అని చెప్పి -- నాతో పాటు మీరు ఆరుగురూ కూడా **(01) S.A. Ayer, (02 ) Debnath Das, {03 } Colonel Habibur Rahman, [04 }Captain Gulzara**

**Singh,{05} Colonel Pritam Singh and {06}Major Abid Hasan,** భారత స్వాతంత్ర పోరాటం ఇంకా కొనసాగించటం కోసము అని - నాతో పాటు బ్యాంగ్ కాక్ విడిచి రావలసింది " అని చెప్పారు .

ఈ ఆరుగురు కూడా తమ వ్యక్తిగత సామానుతో పాటుగా మరునాటి ఉదయము తనను , తన నివాసంలో కలవాలని బోసుగారు వారికి చెప్పాడు .

ఆరాత్రి బోసుగారు , **Kundan Singh** మరియూ **Abid** హాసన్ అనే ముగ్గురు కలిసి - విలువైన బంగారు నగలు మరియూ నాణేలను మూడు ఇనుప పెట్టెలలోకి సర్దారు . ఒక్కో పెట్టె **75** నుండీ **90** కేజీలు బంగారం తో వున్నది అని అంచనా అయ్యింది .{ తమ వద్ద వున్న మొత్తము బంగారాన్ని మూడు పెట్టెలలోకి సర్దారు - అంటే తమతో తీసుకు వెళ్ళటానికి కాదు - దాన్ని భద్రం చేయటానికి }

**at 8 am on August 16,**న జపాన్ వారు అల్లైడ్ ఫోర్సెస్ వారికి లొంగి పోగా , **1945 August 17,** న నేతాజీ మరియూ ఆయన ఆరుగురు అనుచరులు బ్యాంకాక్ లో ఒక విమానం ఎక్కి అక్కడనుండి బయట పడి **Saigon** అనే విమానాశ్రయం లో ఉదయం తొమ్మిది గంటలకు దిగారు . వియత్నాం లోని సైగాన్ అనే పట్టణములో **Tan Son Nhat** అనే పేరు గల ఎయిర్పోర్ట్ వున్నది . ఇది నేటికీ వున్నది . బోసు గారు ఈ ఎయిర్ పోర్ట్ లో

దిగి - ఇంకా ముందుకు పెళ్లేందుకు గానూ మరో విమానము ఎక్కటానికి సిద్ధ పడి వచ్చారు .
నిధుల పెట్టెలు వీరి చేతుల్లో వున్నాయి . ఈ సైగాన్ విమానాశ్రయము నుండి నేతాజీ ఇంకా ముందుకు పోవాల్సి వుంది . కానీ ఈయనను తీసుకు వెళ్ల వలసిన విమానం మాత్రం అక్కడలేదు .

నేతాజీ కి ఒక స్వంత విమానం వున్నది కానీ అది ఎగరలేని పక్షిలా వున్నది . సైగన్ మీదుగా టోక్యో పెడుతున్న చిన్న మిలిటరీ బాంబర్ విమానముఒకటి వచ్చి అక్కడ ఆగింది . ఇప్పటికే దానిలో కొందరు ప్రయాణీకులు వున్నారు . విమానం లో నేతాజీ ఒక్కడికే చోటు ఉందని - దానిలో ఎక్కి టోక్యోకి పొమ్మని ఈ సైగన్ పోర్ట్ వారు చెప్పారు . తాను తన అనుచరులతో కలిసి మాత్రమే విమానం ఎక్కుతానని - లేదంటే లేదని నేతాజీ అన్నారు . నేతాజీ జపాన్ కి మిత్రులు కాబట్టి ఈయనను రక్షించవలసిన మిత్ర ధర్మమూ వారికి ఉన్నది . అందువల్ల విమానము తన దారిన తానూ పోవటానికి బదులు - బోసు గారిగురించి అధికారులు ఇచ్చే ఆదేశాలకోసము వేచి ఉండటం తప్పని సరి ఐయ్యింది. విమానం పైలెట్ కి మరియు టోక్యో అధికారులకు మధ్య సంప్రదింపులు మొదలయ్యాయి . ఫలితంగా **Habibur Rahman** అనే నేతాజీ అనుమాయి ల్లో ఒకరికి సీటు కేటాయించారు .

" నేను కొంత లగేజీ వదులుకుంటాను . నా వాళ్ళలో  ఇంకొందరికి సీట్లు ఇవ్వండి " అని  నేతాజీ అడిగారు . కానీ అది కుదరలేదు . వీఅప్పుడు నేతాజీ తన మిగిలిన ఐదుగురు అనుమాయులతో " మీరు వెళ్లి    ఎయిర్పోర్ట్ అధికారులతో సంప్రతించి మీకు కూడా సీట్లు పొంది రండి " అని  చెప్పారు.  ఈ లోపుగా తమ అందరికీ చెందిన లగేజీ మొత్తము విమానం వద్దకు చేరుతుంది  అని నేతాజీ ఆశించారు .

నేతాజీ ఈరకంగా మొత్తంఅందరికీ  సీట్లను పొందేందుకు ప్రయత్నం చేస్తూ ఉన్నాడు .     కానీ  విమానం పైలెట్ వెంటనే జాపాను  వెళ్లి పోవాలన్న తొందరలో  వున్నాడు. అది యుద్ధ సమయము కాబట్టి - ఏక్షణా న ఏమి జరుగుతుందో అనే ఆందోళన అతడిలో ఉండటం సహజమే . అతడు  ఈ సంప్రతియింపులూ , అనవసర జాప్యం పట్ల చాలా అసహనంగా వున్నాడు . అతడు తన విమానం వద్దకు వస్తున్న లగేజీని చూసి - అది చాలా బరువు కల లగేజీ అని అంచనాకి వచ్చాడు .  ఈ పైలట్  పేరు , **Lieutenant Colonel Nonogaki**, ఇతడు నేతాజీతో " ఇంకో  మనిషిని కానీ మీతో వున్నా ఆపెట్టెలని కానీ ఎదో ఒకటి మాత్రమే విమానంలోకి ఎక్కించుకోగలను"  అని చెప్పాడు . ఏది ఏమైనా పైలెట్ ఏ విమానానికి సర్వాధికారి కదా ? అందువల్ల  నేతాజీ నిధివున్న పెట్టెలను  తీసుకుపోవటానికి ప్రాధాన్యం ఇచ్చారు  .

జరుగుతున్న ఆలస్యం పట్ల విమానము పైలెట్ అసహనంగా వున్నాడని చెప్పుకున్నాము కదా ? అతడు తన విమానాన్ని స్టార్ట్ చేసి , **Debnath** దాస్ మరియు **Pritam Singh -** లు అందచేసిన పెట్టెలను తీసుకుని విమానం లోకి వేసుకున్నాడు . పెట్టెలు ఒక్కొక్కటి సుమారు **20** కేజీల వరకూ బరువు వుండి వుంటాయని ఈ పైలెట్ చెప్పాడు .అనగా విమానం వద్దకు లగేజీగా వచ్చిన మొత్తము బంగారము విమానము ఎక్కలేదు . ఇలా చూస్తే ఒక్కొక్కటి **75** నుండి **90** కేజీల బరువున్న మొదటి మూడు పెట్టెలు మరలా చిన్న చిన్న పెట్టెలలోకి సర్దినట్లు అర్థం అవుతుంది

**August 18,** న -నేతాజీ ఎక్కిన ఈ విమానము - జపనీస్ వారి ఏలుబడిలో వున్న తైవాను లోని **Taihoku, Formosa (Taiwan),**ఎయిర్ పోర్టులో దిగుతూ - రన్ వే ని గుద్దుకొని మంటల పాలు అయ్యింది . విమానము రన్వే కి **20** మీటర్ల ఎత్తులో ఉండగా **-** ప్రొపెల్లర్ రెక్కవిరిగి విమానము నెలకు గుద్దుకుంది. ఇందులో నేతాజీ మరియూ ఇతర ఐదుగురు జపాన్ వారు మరణించారు .

ఈ విమాన ప్రమాదంలో **-** నేతాజీ తన వెంట తెచ్చుకున్న నిధులు **-** రన్ వే మీద చెల్లా చెదురుగా పడ్డాయి . పెట్టెలలోని నిధులు ఎక్కువగా బంగారు నగల రూపంలో వున్నాయి.అవి మంటల వేడికి కరిగి పోయి నల్లని ముద్దలు గా అయ్యాయి .

విమాన శకలాలను ఒక చోట చేర్చే క్రమంలో ( అనగా నిధులకోసం చూస్తూ కాదు } - విమానాశ్రయ అధికారులు అక్కడక్కడా చెల్లాచెదురుగా పడివున్న వస్తువులను ఒకచోటికి చేర్చారు . దీనిలో బోసుగారి బంగారు నిధికూడా వున్నది .
విమానాశ్రయ అధికారులు తాము కలెక్ట్ చేసిన బంగారు వస్తువులని- **18** లీటర్లు పట్టే ఖాళీ పెట్రోల్ డ్రం లో పెట్టి దాని తూకం **16** కేజీలు అని నిర్ధారణ చేసి - ఈ డ్రమ్ముని - మరియూ నేతాజీ యొక్క ఎముకల ను **September 5, 1945.** న టోక్యోకి పంపారు .బంగారాన్ని **September 8, 1945.**న టోక్యోలో **IIL** ప్రెసిడెంట్ గా ఉంటున్న రామమూర్తి - అనే వారికి అప్పగించారు .

నేతాజీ తో పాటు బయలుదేరిన **Habibur** మరియి **IIL** ప్రెసిడెంట్ గా ఉంటున్న రామమూర్తి కలిసి - ఈ పెట్టెని ఓపెన్ చేసి -బంగారాన్ని తూకం వేసి అది పదకొండు కిలోల బరువు వున్నది అని వుమ్మడి సంతకం చేశారు. .ఈ బంగారపు నిధి **September 24, 1951** వరకూ రామ మూర్తి వద్దనే వున్నది.తరువాత నే ఇది ఢీల్లీ కి అప్పగించ బడింది . ఇండియా చేరినఈ నిధిని జవహర్ లాల్ నెహ్రు గారు పరిశీలించి " విమానం మంటల్లో బంగారం అంతా కాలి - కరిగి - ముద్దకట్టి మసి చూరినందున - నిధి చూడటానికి ఏమీ ఆకర్షణ గాలేదని చెప్పారు .




**Above –** కాలి పోయిన నేతాజీ బంగారము - ఒక ఫోటో

నేతాజీ వద్ద వున్నా నిధుల తరలింపు అనేక హడావుడి సంఘటన ల మధ్య జరిగినందున - నేతాజీ గారు తన వెంట వున్న ఇనుప పెట్టెలలో అసలు ఎంత బంగారము తీసుకుని సింగపూర్ వీడి బ్యాంగ్ కాక్ వచ్చారో అన్నది ఎక్కడా లెక్క రాయ బడలేదు .

ఇక నేతాజీ విమానంలో తన వెంట తెచ్చుకున్న బంగారము - లో నుండి **13** కేజీలు జాపాన్ వారి ద్వారా లెక్కకి వచ్చింది. అసలు నేతాజీగారు తన వద్ద వున్న బంగారము అంతా తన వెంట తీసుకొనే బయలు దేరేరా **?** లేక ఇంకా ఎక్కడన్నా ఎమన్నా ఉన్నదా **?** అన్న ప్రశ్నవున్నది .

దీనికి కారణము

**1945.**లో వచ్చిన **January 23,** న అనగా నేతాజీ జన్మదినం నాడు ఆయనను అయన అభిమానులు బంగారు తులాభారం తూచారు **.** అప్పుడు ఈయన **65** నుండి **85** కేజీలకు సమానమైన బంగారము తో తూచ పడ్డాడు **.( 65** నుండీ **85** వరకు అంటే బంగారపు నగల లో వున్న రాగి **-** వెండి **,** ఇత్తడి శీలలు **-** నూలు తాళ్ళు వంటివి తీసివేయగా **-**నికరంగా మిగులుతుంది అనుకున్న బంగారము**} .** ఈ బంగారము రంగూన్ లో వున్నా **Azad Hind Bank** లో దాచబడింది




పైన చూపినది - నేతాజీ ప్రభుత్వం చే విడుదల చేయబడ్డ కరీన్సీ

**Azad Hind Bank – Rangoon,** లో తన ముఖ్య కార్యాలయాన్ని కలిగి **-** జపాన్ వారి సహకారంతో నడుస్తూ

ఉండేది ఇది నేతాజీ స్థాపించిన ప్రవాస భారత ప్రభుత్వ బ్యాంకు .. దీనిలోని **64** కేజీల బంగారాన్ని ఇండియన్ నేషనల్ ఆర్మీ తన అవసరాలకోసము గానూ తీసుకుపెళ్ళింది అని ఈ బ్యాంకు చెప్పింది .

నేతాజీ తో పాటు సింగపూరు నుండి బాంక్ కాక్ కు ప్రయాణించిన **Kundan Singh** చెప్పిన దాని ప్రకారం **-** నేతాజీ వెంట వున్న ఇనప పెట్టెలు**-** మొత్తము **- 59 to 74 kg** ల బరువు కల బంగారము వున్నది . విమానాశ్రయాలలో లగేజీని తప్పని సరిగా తూస్తారు . ఎందుకంటే **?** ఎక్కువ లగేజీ అనేది విమానము భద్రంగా ఎగరటం మీద చాలా వ్యతిరేక ప్రభావం చూపిస్తుంది విమానం కూలిపోవచ్చు . అందువల్ల విమానపు భద్రత దృష్ట్యా బాంగ్ కాక్ విమానాశ్రయం లో పెట్టెలను తూచినపుడు ఇవి నాలుగు పెట్టెలు కల్సి **59 to 74** కేజీ బరువు వున్నాయి. దీనినే **kundan singh** చెప్పాడు .

దీనివల్ల నేతాజీ **70** కేజీల కు మించని బంగారాన్ని తన వెంట తీసుకొని సైగన్ లో దిగారు అని నిర్ధారణ అయ్యింది . సైగాన్ లో విమానం మారే సమయంలో **-** విమానానికి బరువు తగ్గించే ఉద్దేశ్యముతో **-** అది సురక్షితంగా ప్రయాణించటానికి వీలుగా **--** కేవలం రొండు పెట్టెలను మాత్రమే నేతాజీ విమానం లోకి ఎక్కించారు .

విమానాశ్రయం లో నాలుగు పెట్టెలు తూచారు కాబట్టి - విమానము లోనికి ఎక్కని మరో రెండు పెట్టెలబరువు దాదాపు **30** కేజీల ని నిర్ధారణ అయ్యింది . ఈ నిధి సైగాన్ విమానాశ్రయంలోనే ఆగిపోయింది .

ఈ **30** కేజీల బంగారము నుండీ - **300** గ్రాముల బంగారాన్నిమాత్రమే లెక్కల్లో చూపి - దాన్ని టోక్యో అధికారులకు అందించారు **Saigon,** ఎయిర్పోర్ట్ అధికారులు. నేతాజీ తో పాటు బయలు దేరి వచ్చి ,సైగాన్ ఏ యిర్పోర్ట్ లో దిగుబడి పోయిన నేతాజీ అనుచరులు ఈ బంగారంలోని తరుగుదల గురించి ఏమీ మాటాడలేదు .ఇట్లా కొంత నిధి మాయం అయ్యింది .

విమానము కాలిపోయినపుడు -నేతాజీ వెంట వున్న బంగారము కొంత కరిగి పోయింది అనుకున్నాక - మొత్తము మీద **59** కేజీల నేతాజీ గారి బంగారము మాయం అయ్యిందని అంచనా వేయబడింది.

టీవీ లలో అప్పుడప్పుడు నేతాజీ నిధి గురించి న కథనాలు చూసి - ఆనిది ఎన్నో టన్నుల బరువు ఉండేదని అభిప్రాయంనాకు కలిగేది . టన్నులు టన్నులు ఉండికూడా ఉండవచ్చు . ఎలాగంటే యుద్ధ సమయములో జపాను వారు కూడా కొంత బంగారాన్ని మలేషియాలో దోచి- దాన్ని తమ మిత్రుడు బోసు గారి కాపలాలో ఉంచారు

నిధి గురించి ఇక్కడితో ముగిసింది -

నేతాజీ మరణించలేదని - తప్పించుకున్నారని కొన్నాళ్ళ పాటు వార్తలు నడిచాయి . ఇప్పటికి ఆయన- వయస్సు మూలకంగా సైనా మరణించే ఉంటాడు అన్న దానిలో ఎవరికీ సందేహము లేదు . కానీ విమానం ప్రమాదంలో ఆయన మరణించాడా లేదా ? అన్నదే మనకు తెలియ వలసిన విషయము . దాన్ని గురించి తెలుసుకోవటం కూడా ఆసక్తికరంగా ఉంటుంది . ఇందులోనే బోసుగారు తన మృత్యు క్షణాలు ఎలాగా గడిపారు అన్నది కూడా తెలుస్తుంది .

నేతాజీ సుభాష్ చెంద్ర బోసుగారి మరణము గురించి .

ప్రతి పల్లెటూరి లోనూ - ప్రతి పట్టణము లోనూ గాంధీ నేహరూ గారి తో సమంగా నేతాజీ గారి బొమ్మ కూడా ఉంటుంది . గాంధీ బొమ్మ సెంటర్ లాగా.బోసుబొమ్మ సెంటర్ లుకూడా ఉండేవి - భారత దేశానికి స్వాతంత్రము రావటానికి గొప్ప కృషి సల్పిన వ్యక్తిగా నేతాజీ భారతీయుల గుర్తింపు పొందారు . అందునకే ఆయనకు ఊరూరా విగ్రహాలు .

నేతాజీ గారి విగ్రహాల కింద ఉన్న దిమ్మెల మీద " జననము **January 23, 1897** అని రాసి - ఆతదుపరి మరణము - అని

రాయటానికి బదులు అదృశ్యము - **August 18, 1945** అని రాసి ఉండేది .

వీరు భారత {స్వాతంత్రము ఒకరు ఇస్తే పుచ్చుకోవలిసింది కాదు - సాధించుకోవాలిసినది అన్న భావనతోఆజాద్ హింద్ ఫౌజు ను - ప్రవాస భారతీయ ప్రభుత్వమును కూడా ఏర్పరిచారు

నేతాజీ గారు భారతీయ మారుమూల పల్లె పల్లెలనుండీ కూడా ఆరాధనలు అందుకున్న అసామాన్య వ్యక్తి . ఈ అసామాన్య వ్యక్తి జీవితము అకస్మాత్తుగా ముగియటం చాలామందికి ఇష్టకములేక పోయింది . ఆ ఇష్టము లేని వారిలో - నేతాజీ కీర్తి ప్రతిష్టల నుండి ఇంకా సొమ్ముచేసుకోవాలి లేదా ఇంకా పేరు తెచ్చుకోవాలి అనుకున్న వారు - వుండే అవకాశమే ఎక్కువగా వున్నది ? .అలంటి వారి ఇష్టము మేరకు నేతాజీ మరణము గురించి అనేక కధలు పుట్టినవి . అసలు అయన మరణించలేదని తేల్చిన వారు కూడా వున్నారు .

బోసు గారిని - టోక్యోకి తీసుకువెళుతున్న జపాను మిలిటరీ వారి విమానము- జపాను వారి అధీనములో ఉన్న తైవాను లోని **Formosa** ఎయిర్ పోర్టులో నేలను గ్రుద్దు కోగా **August 18, 1945,** న బోసుగారు మరణించారు అనేది మొదటి అభిప్రాయము .ఈ మొదటి అభిప్రాయాన్ని కాదనటానికి వచ్చినవే మిగతా అన్ని అభిప్రాయాలూ .

నేతాజీ గారు తాను మరణించినట్లు ఒక భ్రమ  కలిగేలావుండే ఒక నాటకం నడిపి ఇంగ్లాండ్ వారిని మోసపుచ్చ దలిచాడని ఒక వాదము వుంది . అలా  తప్పించుకున్న బోసుగారు నార్త్ ఇండియా చేరి - తనవునికి ఎవరికీ తెలియనీయకుండా ఒంటరి జీవితం గడిపారు అని .ఇంకొక వాదము ఉంది .ఇంకో వాదము ప్రకారము , మరణించకుండా తప్పించుకున్న బోసుగా రిని-- గాంధీ గారు నెహ్రు  గారూ కలసి మోసపూరితంగా బందించి సోవియట్  యూనియన్ లోని  ఒక  జైలులో భందించారని ఇంకో అభిప్రాయము వున్నది .

ఇవన్నీ కూడా నేతాజీ జీవిత చెరిత్రను రసకందాయంలో పడవేయటానికి ఊహించి రాసిన విషయాలే . కానీ నిప్పులేనిదే పొగరాదన్నట్లు - ప్రతి విచిత్ర అభిప్రాయానికి ఎదో  ఒక ఆధారం వున్నది .

బోసు గారు మరణించాడు అన్న వార్త రాగానే - ఆనాటి బ్రిటిష్ ఇండియా  ప్రభుత్వము- జపాన్ ప్రభుత్వమూ -- మరియూ రొండో ప్రపంచ యుద్ధములో పాల్గొన్న **Allied** ఫోర్సెస్ .వారు ముగ్గురూ - వేరు వేరు విచారణా కమిటీలు వేశారు .

నేతాజీ ప్రపంచ ప్రజలపై కూడా  ఎంతో ప్రభావము చూపిన వ్యక్తి - కాబట్టి -- .  ముగింపుకు వచ్చిన రొండో ప్రపంచ యుద్ధాన్ని - నేతాజీ తన ప్రతిభా పాటవాలతో - ఇంకా ఎమన్నా కొత్త మలుపులు తిప్పుతాడో ఏమో అని వీరు భయ పడ్డారు.

అందువల్ల ఈ కమిటీలు నేతాజీ మరణించారా ?లేదా ? లేక సజీవులుగా తప్పించుకున్నారా? అనేది తెలుసుకునేందుకు కాక - నేతాజీ యొక్క అడ్డు తొలగి పోయిందా ?లేదా ? అని నిర్ధారించుకోవటానికి వేసిన కమిటీలు . అడ్డుతొలగటం అంటే అచేతనంగా కోమాలో ఉండటం లేదా ఎక్కడన్నా ఏదైనా జెలులోఉండటం.జెలులోఉండటం ఉంటే నేతాజీ గారి అడ్డు తొలిగినట్లే కదా ? బోసు అడ్డు తొలిగిందా లేదా అనే మాట కింద విచారణ చేపట్టటం వల్ల -- బ్రిటిష్ ఇండియా వారు -- గాంధీ గారు నెహ్రు గారూ కలసి నేతాజీ గారిని బందించి - సోవియట్ యూనియన్ లోని ఒక జైలులో భందించారన్న వాదము బయలు దేరింది . ఈ వివాదానికి ఆజ్యం పోస్తూ కొందరు నేతాజీ వీరా అభిమానులు - ఐన భారత ఎంపీ లు కొందరు -- ఆయన రష్యా లోని సైబీరియా జైలు లో వుండగానూ - అయన క్రెమ్లిన్ భవనానికి వెడుతుండగానూ తాము చూసాము అంటూ కొందరు రష్యా అధికారులు తమకు చెప్పారు అంటూ ప్రకటనలు కూడా ఇచ్చారు .

రెండో ప్రపంచ యుద్ధములో విజయము సాధించిన అల్లైడ్ ఫోర్సెస్ **{ Great Britain, the United States, and the Soviet Union** ఈ మూడు కలసి అల్లైడ్ ఫోర్సెస్**}** —తరఫున అమెరికన్లు బోసుగారి మరణం మీద విచారణ జరిపారు . యుద్ధములో జపాన్ లొంగి పోయింది కదా ? అందువల్ల జపాన్లోని ప్రభుత్వము అంటే అల్లైడ్ ఫోర్సెస్ ఆధీనంలోవున్న ప్రభుత్వమే అయ్యింది కదా ? అల్లైడ్ నేషన్స్ లో బ్రిటన్ కూడా

వున్నది కదా ? అందువల్ల బ్రిటన్ వారి తరఫున జరిగే విచారణ అన్నా కూడా  ఈ అల్లైడ్ ఫోర్స్ వారి అధీనం లో జరిగే విచారణయే అయ్యింది . పేరుకు మోూడు కమిటీలు ఉన్నాగానీ   ముగ్గురి తరఫున ఒక్క అల్లైడ్ ఫోర్సెస్ ఏ  విచారణ జరిపింది  .

వారు తమ   నివేదికలో**-- August 18, 1945** న జరిగిన విమాన ప్రమాదంలో గాయ పడ్డ బోసుగారు ఆరోజు సాయంకాలం మరణించారని తేల్చి చెప్పింది .గాయపడటం తదుపరి మరణించటం అనే మాటల ఆధారంగా - ఈ మధ్య గాప్ లో అయన జపాన్లో మాయం అయి నార్త్ ఇండియా చేరుకున్నాడన్న వూహ ప్రాణం పోసుకుంది .

నేతాజీ గారి మరణ నిర్ధారణకు గానూ  మరొక విచారణ చేప్పట్ట దలచిన బ్రిటన్  -  తన స్వంత పోలీసులలోనుండి  ఇరువురు పోలీసులను ని ఎంపిక చేసి  {పేర్లు **Finney and Davis }** వారికి  ఇరువురు సహాయకులను ఇచ్చి { పేర్లు  **H.K. Roy and K.P. Dey }** ,నేతాజీ ప్రయాణించుచూ వచ్చిన **Bangkok,**  సైగాన్ {బోసు గారు  విమానము మారినచోటు} మరియూ **Taihoku {** విమానము కాలిపోయిన}  చోట్లలో విచారణ చేసి రమ్మని పంపింది .

వీరు  వెళ్లి  ప్రమాద అనంతరము- నేతాజీ చేర్చపడ్డ హాస్పిటల్ కి వెళ్లి అక్కడా కూడా విచారణ జరిపారు . సింగపూర్ లో వున్నపుడు " నిధులను దాచివేయమంటూ " బోసుగారు బ్యాంగ్

కాక్ కి ఇచ్చిన టెలిగ్రాము ను కూడా వెతికి పట్టుకొని దాన్ని కూడా పరిశీలించారు .



The NanMon military hospital, Taihoku, where Netaji was admitted with burn injuries
(photo of 1946, the building was demolished later)

పై చిత్రము బోసుగారికి చికిత్స అందించిన  మిలటరీ హాస్పిటల్

జపాన్ ప్రభుత్వానికి మరియూ - నేతాజీగారి ఆజాద్ హిందూ ఫవుజ్ ప్రభుత్వము మధ్య సంధాన కర్త  లేదా మధ్య వర్తిగా పని చేసిన వారిని కూడా ఈ బ్రిటిష్  పోలీసు అధికారులు విచారించారు .

.

ఎన్ని కోణాలలోనుంచీ చూసినా కూడా, నేతాజీ మొదట గాయపడి తదుపరి మరణించారు అని ఏ తేలింది . కానీ "బోసు తిరిగి వస్తారు" అని చెప్పటం - ఆయన అనుమాయిలు మానలేదు .

దీనితో " బోసు గురించి మనకు లేని సమాచారం ఏదన్నా వీరి వద్ద ఉన్నదా ?ఏమి? అని "బ్రిటన్ వారుఆందోళన పడ్డారు .

దీనితో వారు **-1946,**లో - టోక్యోలో ఉంటున్న తమ ఇంటెలిజెన్స్ ఆఫీసర్ **- I John G. Figgess,** అనే ఆయనను **-** నేతాజీ మరణం గురించి మరొక సారి విచారణ చేపట్టమని ఆదేశించారు . మరొక విచారణ అన్నప్పుడు ప్రభుత్వం మరింత విషయాలు తెలుసుకో గోరుతున్నదని అర్ధము . ఈ ఆఫీసర్ గారు మరిన్ని వివరాలు సేకరించి **-** ఇలా తెలియ చేసాడు . నేతాజీ గారు **-** జపాన్ యొక్క లెఫ్టినెంట్ గవర్నర్ **sunamasa Shidei {**విమాన ప్రమాదంలో మరణించిన ఐదుగు రు జపనీయులలో ఈయన ఒకరు**}** యొక్క ముఖ్య అతిధిగా విమానం లో సీటు కల్పించ పడినాడు . ఈ విమానము జపాన్ వారి అధీనంలో ఉన్న ఫామోస అనే విమానాశ్రయములో నేలకు గుద్దుకొని కాలి పోయింది . ప్రమాదంలో పైలెట్ మరియు సహాయ మరియూ **General Shidei** అక్కడికి అక్కడే మరణించారు . బోసు గారు విమానంలో ఉన్న పెట్రోల్ తో తడిసినందువల్ల ఆయనకు మంటలు అంటుకొని **-** ఆయన తీవ్రంగా గాయ పడ్డారు**{** మరొకరి నివేదిక ప్రకారం **-** అత్యవసర వినియోగం కోసము అని కొంత

అదనపు పెట్రోల్ పైలోట్ తో పాటుగా వున్నది } . ఆ వెంటనే నేతాజీ ని  తైహోకు లో ఉన్న మిలటరీ వారి హాస్పిటల్ కి తరలించారు . శరీరము పైభాగము అంతా పూర్తిగా కాలిపోయిన బోసుగారికి ఆ ఆస్పత్రిలో - ఆరు గంటల పాటు చికిత్స అందించారు . హాస్పిటల్ లోని ఒక చీఫ్ సర్జెన్  - **{ Dr Taneyoshi Yoshimi,}** ఇద్దరు డాక్టర్లు **{ Dr Truruta and Dr Ishii,}** మరియూ ఆరుగురు సిబ్బంది మరియూ ఒక స్టాఫ్ నర్స్ ఈ చికిత్సను జరిపారు .  బోసు గారు చికిత్స పొందుతూ ముందుగా కోమాలోకి వెళ్లి అదే రోజు సాయంత్రం  - **9 PM and 10 PM**  మధ్య మరణించారు . నేతాజీ తో పాటు విమానము ఎక్కిన అయన అనుచరుడు . **Habib ur Rahman,**కూడా కాలిన గాయాలతో నేతాజీ పాటుగా వున్నాడు - ఈయన మృత్యు గండము నుండీ  తప్పించు కున్నాడు .  **Habib ur Rahman** ఆ తదుపరి పది సంవత్సారాల తరువాత మాటాడుతూ - నేతాజీ వంటి పైన గాయాలేమీ ఉన్నట్లు తనకు తెలియదని - తాను చూడలేదు అని అన్నాడు .

నేతాజీ పాటుగా మరణించిన జపాన్ మిలటరీ జెనెరేల్  యొక్క అస్థికలను  జపాన్ లోని రెంకోజీ  టెంపుల్ కి పంపారు . బోసు గారి యొక్క అస్థికలను కూడా అక్కడికే పంపారు .{ దీనిని బట్టి చూస్తూ ఉంటే ఈ మిలిటరీ హాస్పటల్ లో మరణించిన ప్రముఖుల మృత దేహాలకు ముందుగా పంచనామా నిర్వహించి ఆ దేహాన్ని మున్సిపల్ వారికి అందచేస్తారు.  ఆ మున్సిపల్ వారు - అస్థికలను రెంకోజీ టెంపుల్ కె పంపుతూ ఉంటారని - లాజిక్

ప్రకారంగా అనిపిస్తూ ఉంటుంది } రెంకోజీ టెంపుల్ కె ఎందుకు పంపుతారు అన్నది ముందు ముందు తెలుసుకుంటాము .

.

ఈ విచారణలో--నేతాజీ గారు మరణించాడు అనే తేలింది . దానితో పాటు నేతాజీ గడిపిన చివరి క్షణాల గురించి కొన్ని వివరాలు తెలిసాయి .

హాస్పిటల్ వైద్యులు చెప్పిన దాని ప్రకారము " నువ్వు నావెంట ఈ రాత్రి అంతా ఉండగలవా ? అని బోసు గారు ఒక వైద్యుని అడిగాబు . ఇలా అడిగిన గంట తదుపరి బోసుగారు కోమాలోకి వెళ్లి ఆపై మరణించారు . అందువల్ల ఫిగ్స్ అనే ఈ ఇంగిలీషు అధికారి - **"Bose died in a Taihoku Military Hospital sometime between 1900 hours and 2000 hours local time on the 18th August 1945."**అని రిపోర్ట్ ఇచ్చారు .

దీనితో బోసు గారి మరణం గురించి బ్రిటీష్ వారు సంతృప్తి చెందారు

బోసు గారు **Taihoku** మిలిటరీ హాస్పిటల్ లో కాలిన గాయాలతో ఎడ్మిట్ చేయపడినపుడు -- ఆ హాస్పిటల్ ఇంచార్జి గా వున్నా జపాన్ డాక్టర్ గారు - చెప్పిన దాని ప్రకారము " బోసు గారి శరీరం మొత్తము అంతా కాలిపోయింది .ఆయన నెత్తిన మిగిలి వున్నా కొద్దీ పాటి జుట్టు ఆధారముగా మేము ఆయనను బోసు గారు అని నిర్ధారించాము . ఆయన ఎక్కువగా ఇంగిలీషు లో మాట్లాడగా దాన్ని జాపనీస్ భాషలోకి అనువదించి తిరిగి

మాకు చెప్పటానికి గానూ  ఒక దుబాషీని పిలిపించాము .ఈ దుబాషీ సివిల్ అధికారి . ఆయన వచ్చి - కాలిన గాయాలతో పడివున్నది బోసు గారే అన్న ఉద్దేశ్యముతో ఆయనను  రకరకాల రాజకీయ పరమైన ప్రశ్నలు అడిగారు .   ఆ సంభాషణ యొక్క తీరును పట్టి - మరియు ఆ సివిల్ అధికారి ఆయన బోసుగారే అని నమ్మి మరిన్ని ప్రశ్నలు వేసి సమాధానము రాబడుతుండటాన్ని చూసి నేను - కాలిన గాయాలతో వున్నవారు ఖచ్చితంగా బోసుగారే అన్న నమ్మకానికి వచ్చాము .ఆ రకంగా చనిపోయింది బోసుగారే నాని నేను నమ్మాను.  { దీనిని పాజిటివ్ ఐడెంటిఫికేషన్ అంటారు - అనగా డిఎన్ఏ లాంటి శాస్త్ర ఆధారాలు ఏమీ లేకుండా చనిపోయిన వ్యక్తి ని గుర్తించటం }

ఈ సంభాషణ జరుగుతుండగానూ,  మరియు బోసుగారిని హాస్పిటల్ లో చేర్చిన నాలుగు గంటలకు ఆయన క్రమంగా స్పృహ కోల్పోయారు.  ఆ స్థితిలో కూడా ఆయన  ఏవో మాట్లాడుతూనే వున్నారు కానీ తిరిగి స్పృహలోకి మాత్రం రాలేదు . చివరికి  **11 pm**  గంటల ప్రాంతములో    ఆయన మరణించారు   .  ఇవే కాక ఆయన్ని హాస్పిటల్ లో చేర్పించినపుడు ఒక అధికారి నావద్దకు వచ్చి " వీరు బోసుగారు . వీరిని ఎట్లాగైనా సరే కాపాడి తీరవాలే " అని చెప్పాడు . దీనివలన కూడా  కాలిన గాయాలతో మా హాస్పిటల్ లో చేర్చపడిన వ్యక్తి బోసు గారే అని నేనునమ్మాను .-- అని ఈ డాక్టర్ గారు అన్నాడు .

" మీ కు  ఎలావుంది ? అని - డాక్టర్ అడుగగా "  నా మెదడులో ని నెత్తురు  కట్టలు  తెంచుకొని పారు    తున్నట్లుగా వున్నది . చాలా రోజులుగా నేను మంచి నిద్ర ఎరుగను " అని బోసు గారు బదులిచ్చారుట .  ఈ సమాధానము తరువాత డాక్టర్ లు ఒక ఇంజక్షన్ చేయగా బోసు గారు నిద్రలోకి జారుకున్నారు .

**1953,**లో   **Indian Independence League (IIL),**సభ్యులు, ఆజాద్ హింద్ ప్రభుత్వ ము **{** నేతాజీ స్థాపించిన ప్రచ్ఛన్న భారత ప్రభుత్వము తరఫున **}**  కూడా  ఒక విచారణ జరిపింది   . వీరు కూడా బోసుగారు **August 18, 1945.**న మరణించారని ఏ నిర్ధారించారు . కానీ విమాన ము ప్రమాదానికి లోను కాలేదు అని అది కూల్చివేతకు గురి అయినదని వీరు అన్నారు . అప్పటినుండీ బోసుగారి మరణములో ఎదో కుట్ర కోణము వున్నదని ఒక అభిప్రాయం మొలకెత్తింది.

**IIL,** వారి  ప్రకారము- విమానం ప్రమాదం ఒక కుట్ర -- దానికి కారణము  - జపాను అల్లైడ్ ఫోర్సెస్ వారికి లొంగిపోయింది . ఇప్పుడు వారికి  వారు బోసుని రక్షించటం గానీ  / కాపాడటం గానీ చేస్తే   అది   అల్లైడ్ ఫోర్సెస్  వారికి నచ్చని పని అవుతుంది . కాబట్టి    బోసుగారిని రక్షించి తాము చిక్కుల పాలవటము జపాన్ వారికి ఇష్టము లేదు .  అట్లాగే  తమని నమ్మిన,  తమ స్నేహితుడు అయిన బోసుగారిని   - ఖైదు చేసి ఇంగ్లాన్డ్ వారికి బందీగా అప్పగించి ఆయన ప్రాణాల మీదకు తెచ్చే   ఉద్దేశ్యము కూడా జపాను వారికి  లేదు .   అందువల్ల జపనీయ అధికారులు

ఉదేశ్య పూర్వకంగా నే - నేతాజీతో పాటు  మరి ఒక్కరికి మాత్రమే సీట్లు కేటాయించి - మిగిలిన ఐదుగురు అనుచరులు సైగాన్ విమానాశ్రయంలోనే దిగపడి పోయేటట్లు చూసారు. ఆపై ఉద్దేశ్య పూర్వకంగా విమానాన్ని కూల్చి వేశారు " అని

పై అభిప్రాయాన్ని ఆధారంగా చేసుకొని,  గవర్నమెంట్ అఫ్ ఇండియా వారు కూడా **1956**  లో  ఒక ఎంక్వైరీ జరిపించారు.

ఈ ఎంక్వయిరీ లో మిలటరీ హాస్పిటల్ లోని డాక్టర్ లనే కాక - నేతాజీ పాటు ప్రయాణించి బ్రతికి బయట పడ్డవారిని కూడా ప్రశ్నించారు .

దీన్లో బయట పడిన విశేషము ఏమిటంటే " విమానము గాలిలోకి లేచి ఒక ఇరవై మీటర్ల ఎత్తుకు చేరగా- పైలోట్ విమానము స్పీడ్ పెంచాడు . అప్పుడు - ప్రొపెల్లర్ కు వున్నా మూడు రెక్కలలోని ఒక రెక్క  విరిగి  పోయింది . అందువల్ల విమానం కిందపడి పోయింది .  అప్పుడు విమానము పెళ్లి రన్వే పక్కన వున్నా కంకర గుట్టలను గుద్దుకుని దహనము అయిపోయింది "  ఈ సంఘటనలో కొందరు తప్పించుకోగలిగారు . కానీ విమానపు అత్యవసర వినియోగం కోసం ఉంచిన గ్యాసోలిన్ కొందరి మీద పడింది . వారు మాత్రమే   మంటలలో కాలి పోయారు . అగ్ని జ్వాలలో చిక్కుకున్న బోసుగారు ఆ మంటలతోనే , విమానం లోనుండి కిందకి దూకారు . గాలి వల్లనూ - బోసు గారు ధరించిన

స్వెట్టెర్ మూలకంగానూ బోసు గారు మంటలలో త్రీవ్రంగా గాయపడ్డారు "

బోసు గారు మరణించే సమయానికి ఆయన పక్క వైద్యులు - ఒక దుబాషీ - అయన అనుచరుడు హబిబుర్ రహమాన్ మరియు ఒక గార్డు వున్నారు . బోసు గారి మృత చిహ్నాలను - అస్థికలను - **September 8 1945** న టోక్యోలోని రామ మూర్తి అనే ఆయనకు అప్పగించారు . ఈ మూర్తి అనేవారు జపాన్ కి బోసు గారికి మధ్య టోక్యోలో వున్నా సంధాన కర్త . దీన్ని పట్టి కూడా బోసుగారు మరణించారు అనే తేలింది

-నేతాజీ మరణము గురించి అనేక సార్లు - విషయం సేకరించబడింది .**Bombay's Free Press** జర్నల్ తరఫున . **Harin Shah,**అనేవారు-- **Taihoku** మిలిటరీ హాస్పిటల్ లో- బోసుగారికి చికిత్స జరిపిన టీం లో ఒకరైన నర్సుని ఇంటర్వ్యూ చేసాడు . ఈమె " మా వైద్య అధికారుల సూచనల మేరకూ నేను సుభాష్ పక్కనే వున్నాను .అయన మధ్య మధ్య స్పృహలోకి వచ్చారు . మూలుగుతూనే నీరు అడిగే వారు . నేను అనేక సార్లు నీరు ఇచ్చాను ఆయన కాలిన గాయాలకు ఆలివ్ ఆయిల్ రాసాను - చివరికి ఆయన మరణించారు" అని ఆమె చెప్పింది .దీన్ని పట్టి కూడా బోసుగారు మరణించారు అనే తేలింది

 **the plane netaji boarded**

నేతాజీ చని పోలేదు అంటూ అనేకంగా వస్తున్నా వార్తల లోని వత్తిడితో - **1956** తరువాత ఇండియన్ గవర్మెంట్ **1999** లో జస్టిస్ ముఖర్జీ కమీషన్**{** జేఎంసీ**}** అనే దాన్ని వేసింది **.**అంటే అసలు సంఘటన జరిగిన **50** ఏళ్లకు మరో కమిషన్ అన్న మాట **.**దీనర్థం నేతాజీ ఇంకానూ భారతీయుల మనస్సుల్లో సజీవులే అయి వున్నారు **.**

ఈ జేఎంసీ **2005** నాటికి తన నివేదిక ఇచ్చి దానిలో **"** నేతాజీ మరణించిన మాట నిజమే కానీ **-** నేతాజీ చనిపోయిన రోజున విమాన ప్రమాదం ఏదీ జరుగలేదని **-** అందువల్ల**-** ఆ విమాన ప్రమాదంలో నేతాజీ మరణించారు అంటూ వచ్చిన వార్తలు నమ్మ తగినవి కాదని **--** కమీషన్ అభిప్రాయ పడింది **.**

దీనితో భారత ప్రజలు మరో మూడు లోకి మారి పోయారు

**.**

ముఖర్జీ గారి నివేదికలోని విషయాల ప్రకారం **- "** నేతాజీ గారు ఎక్కిన మిలటరీ విమానము కూలి పోయింది**-** ఆ ప్రమాదం లో ఆయన మరణించారు **"** అంటూ తైవాన్ లో చాలాకాలంగా ప్రచురణలో వున్న స్థానిక వార్తా పత్రికయినా **Central** డైలీ లో ఎటువంటి వార్తలు ప్రచురింప

బడలేదు . విమానము కూలి ఉంటే వారు వార్తల్లో వేసే వారే కదా ? ఈ విషయం వార్తలలో ప్రచురింప బడలేదు కాబట్టి విమానం కూలలేదు . కూలిన విమానమే లేదు కాబట్టి బోసు గారు విమాన ప్రమాదములో మరణించలేదు . మరణము లేదుకాబట్టి బోసు అస్థికలు అని జపాను వారిచే చెప్ప బడుతున్నవి - సందేహాస్పదము " . ఇది ముఖర్జీగారి అభిప్రాయము .

కొని విషయాలను పరిగణలోనికి తీసుకోకుండానే - ముఖర్జీగారు తన నివేదిక ఇచ్చారు అని - అందువల్ల అందులో నిజము లేదు అని ఇతరులు కనుగొన్నారు .

ఇందులో ముఖ్య మైనది ఏమిటంటే **Central** డైలీ అనేది తైవాన్ లోని లోకల్ పేపర్ కాదు . అది చైనా గవర్నమెంట్ వారి కంట్రోల్ లో చైనా వారినుండి నిధులు పొందుతూ - చైనా చెప్పిన వార్తలను మాత్రమే ప్రచురిస్తూ నడిచే పేపర్ . ఇది **1928** నుండీ వున్నది .కాబట్టి గట్టిగా నిలతోక్కుకున్న పత్రిక నే . . చైనా నేతాజీ మరణం పట్ల ఏమీ వెంటనే స్పందించి ఏ వార్తా అందించక పోవటం వల్ల- ఈ పేపర్ నేతాజీ మరణం గురించి వార్తలు వేయలేదు . కానీ ఇదే న్యూస్ పేపర్ లో - నేతాజీ మరణం పట్ల సంతాపము వెలిబుచ్చుతూ ఒక ప్రకటన అచ్చుపడింది - దాన్ని ముఖర్జీగారు లెక్కలోకి తీసుకోలేదు. అదీ సంగతి .
**1949** తరువాత మాత్రమే ఈ పత్రిక స్వతంత్రంగా వ్యవహరించి - చైనా నుండి రాని - చైనవి కాని వార్తలను కూడా ప్రచురించింది .ముఖర్జీ గారు దీన్ని గుర్తించ లేక పోయారు .**1928** నుండీ ప్రచురణలో వున్న ఒక పేపర్ బోసు గారి మరణ వార్తను ప్రచురించలేదంటే - బోసు గారి విమానానికి ప్రమాదం జరగ లేదు కాబట్టి బోసు గారు మరణించనట్లే అని ముఖర్జీ గారు అనుకున్నారు . .నివేదిక లో ఇలాంటివే రొండు మూడు లోపాల వల్ల నేతాజీ బ్రతికే ఉన్నారన్న వార్తలు మళ్ళీ వ్యాప్తిలోకి వచ్చాయి .

**1945** నుండీ **1974,** వరకూ నేతాజీ మరణం పై **-** బ్రిటిష్ ఆర్మీ **-** అల్లైడ్ ఫోర్సెస్ , బ్రిటిష్ ఇండియా ప్రభుత్వమూ **-** జపాను ప్రభుత్వమూ**,** భారత ప్రభుత్వమూ , అన్నీ కలిపి ఫది కి పైగా విచారణలు జరిగాయి , ఒక్క ముఖర్జీగారి నివేదిక తప్ప మరెవ్వరూ కూడా విమాన ప్రమాదం నిజరగలేదు అని కానీ అందులో బోసుగారు మరణించలేదు అని కానీ అనలేదు

కానీ ప్రజలు**-** విమానప్రమాదం జరుగలేదు కాబట్టి నేతాజీ బ్రతికే వున్నారు అన్న దానికే ఎక్కువ ప్రభావితం అయినారు **.** చివర చివరికి **-**అనగా వయస్సు మూలకంగా నైనా నేతాజీ మరణించేసి వుంటారు అన్న భావముతో **-** నేతాజీ మరణించారా లేదా**?** అన్నది పక్కన పడి**,** నేతాజీ మరణంలో ఏదన్నా కుట్ర ఉన్నదా **?** అన్నదే ముఖ్య విషయము అయ్యింది **.**

నేతాజీ మరణించాడని ఆయన్ని ఖననం చేశాబు అన్న దానికి ఇద్దరే సాక్షులు వున్నాబు **.** ఒకరు బోసు తో పాటుగా ప్రయాణించిన **Habibur Rahman** మరియు , బోసు మాట్లాడుతున్న మాటలను జపాన్ భాషలోకి అనువదించి **-** జపాను అధికారులకు తెలియ చెప్పిన **Juichi Nakamura** అనే జపాన్ అధికారి **.** వీరు ఇరువురు కూడా **August 20, 1945** న బోసు అంత్యక్రియలు జరిగాయని నిర్ధారించారు **.**

నేతాజీ తో పాటు వున్నా అయన అనుచరుడు హబీబ్ వున్నాడు కదా**?** ఆయన కూడా కొన్ని విషయాలు చెప్పాడు **.** **.**అయన అన్నది ఏమంటే **"** ప్లేన్ నేలను గుద్దుకోగానే నేను స్పృహకోపోయాను **.** స్పృహలోకి వచ్చేసరికి విమానము మండుతూ వున్నది **.** మా లగేజీ అంతా దొర్లి పడి **-** మేము తప్పించుకోవటానికి వీలున్నవెనుక ద్వారము మూసుక పోయింది **.** అందువల్ల నేను నేతాజీ గారిని ఇటుపైపు రావద్దు అని హెచ్చరించాను **.**

దానితో ఆయన విమానం లోనుండి దూకారు . నేను వున్న చోటనే వున్నట్లుగా కూచున్నాను . "

పై ప్రకారం చూస్తే - లగేజీ అడ్డం పడి విమానానికి వెనుక ద్వారము మూసుకు పోయింది కదా ? మరి ఆ లగేజీ ని తప్పించుకొని కాక హబీబ్ ఎలా బయట పడ్డాడు ? ఒకవేళ హబీబ్ కూడా నేతాజీ గారి లాగానే బయట పడి ఉంటే ఈయనకు ఎందుకు మంటలు అంట లేదు . ఈయన ఎందుకు కాలి పోలేదు అన్న సమాధానం లేని ప్రశ్న పుట్టింది . ఇది కూడా బోసుగారి మరణం వెనుక ఏదో కుట్ర ఉందన్న వాదానికి ఊపిరి పోసింది .

కుట్ర సిద్ధాంతాలు అనేక వచ్చాయి గానీ నేతాజీ మరణించలేదని మాత్రం నిర్ధారణ కాలేదు .

మరణించారు - అన్నాక ఆయన అస్థికలు గురించి ఆసక్తి పెరిగింది . వాటిని ఇండియా తెచ్చి ఆయనకు తగిన నివాళి ఇవ్వాలన్న డిమాండ్ పెరిగింది

నేతాజీ అస్థికల పై వివాదము -

భారత ప్రభుత్వం **1999** ఏర్పరిచిన **Justice Mukherjee Commission November 8, 2005.** న ఒక నివేదిక సమర్పించగా అది **May 17, 2006.** లో పార్లమెంట్ ముందుకు వచ్చింది . ఈ నివేదికలో బోసు మరణించాడు కానీ - అయన విమాన ప్రమాదంలో కాలి మరణించలేదని - అందువలన ఆయన అస్థికలుగా చెప్పబడుతూ - జపాన్ రెంకోజీ టెంపుల్ లోఉంచబడిన అస్థికలు నేతాజీవి కాకపోయి వుండే అవకాశం ఉందని తేల్చి చెప్పింది.

ఇప్పుడు ఆయన అస్థికలు గురించి ఆసక్తి పెరిగింది . వాటిని ఇండియా తెచ్చి ఆయనకు తగిన- స్మారక చిహ్నం నిర్మించి ఒక నివాళి ఇవ్వాలన్న డిమాండ్ పెరిగింది

భారత ప్రభుత్వమూ **1956** లో ఒక ఎంక్వైరీ జరిపించారు కదా **?** దాని పేరు **"Shah Nawaj Committee".** ఈ కమిటీ వెళ్లి " నేతాజీ మరణం గురించి మీ వద్ద వున్న వివరాలు ఏమిటో ఇవ్వండి " అని కోరిన మీదట **".**జపాన్ ప్రభుత్వం **24 July 1956** న ఒక సమాధానం ఇచ్చింది **-** దాని ప్రకారము **. Ichiro Okura** అనే వ్యక్తి పేరున " ఖననం చేయండి " జారీ అయిన ఉత్తరువులే **-** నేతాజీ సుభాష్ చెంద్రబోసుకు చెందిన ఖననపు ఉత్తరువులు " అని చెప్పింది **.** నేతాజీ ఖననాన్ని వేరే పేరుతో నిర్వహించటం ఏమిటి **?** అన్న సందేహం లో నుండి మరో వివాదము పుట్టింది

ఈ వివాదాన్ని పరిష్కరించాలని **-** భావించిన భారత ప్రభుత్వము **-** ఈ దహన ఉత్తరువులు రాసిన అధికారుల ను కూడా విచారించింది **. .** వాళ్ళేమి చెప్పారంటే " ఫామోస **{** విమానం కూలిన చోటు **}** కి సంభందించిన పోలీస్ అధికారులకు **-** జపాన్ కి చెందిన ఒక ఆఫీసర్**-- " Ichiro Okura "**అనే పేరుగల ఒక అతను **19 August 1945** న మరణించాడు**-** అంటూ ఒక సర్టిఫికెట్ ఇచ్చాడు **-** దానిప్రకారం మేము **Ichiro Okura "**అనే పేరుగలవారి దేహాన్ని దహనం చేసాము **.** అంతేగానీ బోసు మరణించాడని చెపుతున్న ఆగష్టు**-18 1945** న **- Ichiro Okura** అనే అతను మరణించాడు అన్న సర్టిఫికెట్ తో **--** మా దెగ్గరికి ఏ శవమూ రాలేదు అని చెప్పారు **.**

శవాన్ని దహనం చేయమని ఆర్డర్ ఇచ్చిన ఆఫీసర్లు " బోసు గారిని మేము ఎన్నడూ చూడలేదు .అందువల్ల **Ichiro Okura** అన్న పేరుతో బోసుగారు దహనం చేయపడ్డారు అని మేము చెప్పలేము " అన్నారు .

" బోసు మరణము గురించి సాధారణ ప్రజలు తమకు తెలిసిన విషయాలు చెప్పవచ్చు " అంటూ **May 1956,** లో టోక్యోలో ఒక ప్రజా విచారణ జరిగింది .

ఈ విచారణలో " **'Okara Ichiro'**అన్న పేరు కల వారికి **17 August 1945** న హార్ట్ అట్టాక్ వచ్చి **19 August 1945** న మరణించాడని తేలింది . అంటే **18 August 1945** మరణించిన బోసుగార్ని **'Okara Ichiro'**అన్న మారు పేరుతో దహనం చేసాము అన్న జపాన్ వాదము వీగి పోయింది. దహనము ఎప్పుడన్నా జరగవచ్చు కానీ డెత్ సెర్టిఫికెట్ అనేది చని పోయిన రోజును పట్టే ఇస్తారుగా ? **18 August 1945** న ఎవరి పేరునా - ఎటువంటి డెత్ సర్టిఫికెట్ లేనందున వేరే పేరుతో నేతాజీ చేయ పడ్డారన్నది అబద్ధము అని తేలింది . దీనితో నేతాజీ అస్థికలు మరల వివాదంలో పడ్డవి

.

నేతాజీ అస్థికలను - డిఎన్ఏ పరీక్షల ద్వారా సరిగా గుర్తించి - ఆ అస్థికలను అవి భద్రం చేయబడి వున్న జపాన్లోని రింకోజీ టెంపుల్ నుండి భారత దేశము తీసుకు రావచ్చునేమో ? పరిశీలించండి " అని **August 13, 2003,** న -భారత ప్రభుత్వము- **Justice Mukherjee** కమిషన్ ను కోరింది .

**JMCI** కోరిక మీద - రింకోజీ టెంపుల్ ప్రీస్ట్ - తమ వద్ద భద్ర ప్రచబడివున్న నేతాజీ అస్థికలను డిఎన్ఏ టెస్టు చేయించటానికి గానీ వాటిని భారత దేశము తీసుకు పోవటానికి గానీ తమకు అభ్యంతరం ఏమీ లేదని తెలిపాడు . " నేతాజీ అవశేషాలు ఇండియా కి గనుక చేరితే - అయన ఆత్మ - తాను తన మాతృ భూమిని మిని చేరుకున్నందుకు గానూ ఎంతో స్వేచ్ఛ మరియు - ఆనందము అనుభవిస్తుంది అని రింకోజీ టెంపుల్ పూజారి అన్నాడు .

నేతాజీ అస్థికలను తిరిగి భారత్ కి ఇవ్వటానికి గాను రింకోజీ టెంపుల్ పూజారి కొన్ని నిభందనలు పెట్టారు . ఇందులో మొదటిది -- నేతాజీ అస్థికలలోని కొన్నింటినైనా రింకోజీ టెంపుల్ కి వదిలి వేయాలి . రొండొవది -- నేతాజీ అస్థికలు మీద నిర్మించే స్తూపాలు కట్టడాలు వంటి వాటి అన్నింటి మీదా - అప్పటి రింకోజీ టెంపుల్ పూజారి మరియు అయన తండ్రి పేరు తప్పని సరిగా రాయాలి . { నేతాజీ గారి హస్తికలను సంరక్షించినందుకు ప్రత్యుపకారం గా ఈ కోర్కె కోరారు }

అప్పుడు **JMCI** కమిటీ " మీ వద్దవున్న నేతాజీ ఎముకలలోని అతి తక్కువగా కాలిన ఎముకలను మాత్రమే మేము తీసుకొనేందుకు మీరు అనుమతి ఇస్తారా " అంటూ రెంకోజీ టెంపుల్ కి లెటర్ రాసింది .

ఈ లెటర్ కి జవాబు రాలేదు . వారు ఏమీ బదులు ఇవ్వలేదు కాబట్టి - నేతాజీ అస్థికలు అని చెప్ప బడుతున్న వాటికి సరియిన డిఎన్ఏ టెస్టులు నిర్వహించ లేమని **JMCI** కమిటీ అన్నది . నేతాజీ అస్థికలను డిఎన్ఏ పరీక్షలకు గురిచేస్తే - ఏవో నిఘూడా రహస్యాలు బయటికి వస్తాయనే ఉద్దేశ్యంతోనే - జపాన్ మరియు రెంకోజీ టెంపుల్

వారు తమకు సమాధానము పంపలేదని కూడా **JMCI** కమిటీ అభిప్రాయ పడింది

బోసుగారు **18** ఆగష్టు **1945** న మరణించగా **-** ఆయన పార్థివ దేహాన్ని **Taihoku** తైహోకు స్మశాన వాటికలో **, 20 August 1945.**న దహనం చేశారు **-**

**7 September 1945** న ఒక జాపనీస్ అధికారి బోసుగారి అస్థికలను సేకరించి తీసుకువెళ్లి **-** ఆ మరుసటి రోజు వాటిని టోక్యోలో నే ఉంటున్న **,** ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్ ప్రెసిడెంట్ అయిన రామ మూర్తికి అందించారు **. 14 September 1945** న నేతాజీ మృతిపట్ల ఒక సంతాప సభ **{**మెమోరియల్ సెర్మనీ **}** నిర్వహించి **-** నేతాజీ అస్థికలను రెంకోజీ టెంపుల్ కి అందించారు **.**

రెంకోజీ టెంపుల్ నే ఎందుకు ఎన్నుకున్నారో **?** ఆలోచించారా **?**

జనులందరూ బుద్ధుని స్వర్గానికి అర్హులేనని **-** మనిషి తనకు వున్న ఒక్క జన్మ కాలంలో మోక్షము కోసము కాలము కేటాయించకుండా **{** అంటే వారు ముసలి వారు అయి ఆధ్యాత్మిక చింతనలో పడక ముందే **}** అకస్మాత్తుగా మరణించినపుడు **-** వారి అస్థికలను కనుక భద్ర పరిచి పెడితే **-** ఆత్మ వాటిని ఆశ్రయించుకుని వుండి, మోక్ష సాధనం కోసం కృషి చేస్తుందని **-** రెంకోజీ టెంపుల్ పూజారులు నమ్ముతారు **.** బుద్ధిజం లో ఇదొక శాఖ **.**

**"** ఒక వ్యక్తి కి మోక్ష సాధనలో సాయ పడటం**-** అనేది తోటి మానవుల కర్తవ్యం **"** అని కూడా రెంకోజీ వారు నమ్ముతారు **.**

నేతాజీ అకస్మాత్తుగా మరణించారు కాబట్టి -- ఆయన ఆత్మ మోక్ష సాధన చేయటానికి వీలుగా - నేతాజీ అస్థికలను రెంకోజీ టెంపుల్ కి అప్ప చెప్పారు . వీరు నేతాజీకి తమ టెంపుల్ ప్రాంగణంలోనే ఒక స్మారక చిహ్నాన్ని నిర్మించారు .బోసు గారి అస్థికలను ఒక కలశంలో భద్రపరిచారు .

**1995** లో - టోక్యోలోని బోస్ అకాడమీఅనే .వారు నేతాజీ గారికి చివరి వర్ధంతి సభ జరిపి - " భారత దేశము నేతాజీ అస్థికలను తీసుకు వెడుతుందా లేదా ? " అనేది భారత్ ని అడిగి తేల్చుకోండి " అని - రెంకోజీ టెంపుల్ వారిని కోరారు . అప్పుడు వారు " భారత్ అస్థికలను తీసుకు వెళ్లక పోతే తాము వాటిని వేరేచోటికి తరలించుతామని - ఇకవాటిని తాము ఏమాత్రము సంరక్షింపలేమని "రెంకోజీ టెంపుల్ వారు భారత్ కి తెలియ పరిచారు.

ఈ నేతాజీ అకాడమీ ఏమిటి ? అనేది కూడా తెలుసుకుందాము

బోసు గారు స్థాపించిన ఇండియన్ నేషనల్ అర్మీలోకి - జాపాను నుండి **45** మంది జపాను యువకులు ఎంపిక చేయబడ్డాబు . వీరిని టోక్యో బోయిస్ అని కూడా అంటారు . జపాన్ కి నేతాజీ కి మధ్య వున్నా యుద్ధ సహకారాన్ని పురస్కరించుకొని కి జపాన్ ప్రభుత్వము ఈ **45** మంది యువకులకు విమాన పైలట్ లుగా శిక్షణ ఇచ్చింది .జపాను యుద్ధములో లొంగి పోగానే - వీరిని యుద్ధ ఖైదీలుగా పట్టుకుని - **1946** లో విడిచి పెట్టారు - వీరు నేతాజీ సైన్యం కాబట్టి - నేతాజీ వర్ధంతిని టోక్యోలో జరుపుతూ ఉండేవారు . అందువల్ల వీరు చేసిన డిమాండ్ ని భారత్ వినవలసి వచ్చింది

నేతాజీ అస్థికలను భారత్ తీసుకు రావటం గురించి - పరిశోధన చేయమని - ఇంటెలిజెన్స్ బ్యూరో **{IB }** వారిని భారత ప్రభుత్వము కోరింది .ఇది - **1995** లో .

అప్పుడు ఐబీ వారు " నేతాజీ విగా చెప్పబడుతున్న అస్థికలను భారత్ కి తీసుకు రావటం వాంఛనీయం కాదని - అలాచేస్తే బోసు గారు మరణించారంటూ నమ్మమని కొందరు ప్రజలను వత్తిడి చేసినట్లు అవుతుందని - దానితో వివాదాలు రాజుకుంటాయని " అన్నారు . అంతే కాక ఆ అస్థికలను ఎంతో పవిత్రంగా - రాచ మర్యాదలతో - ప్రజల మనోభావాలు దెబ్బతినకుండా కూడా తేవలిసి ఉంటుందని- ఇదొక కష్టమైన ప్రక్రియ అవుతుందని ఐబీ అభిప్రాయపడింది .అంతే కాకఏదన్న స్మారక స్తూపము గానే శిలా విగ్రహం కానీ నిర్మిస్తే -- ప్రతి ఎలక్షన్ లో నేతాజీ స్మారక స్తూపం - రాజకీయ గెలుపోటములు నిర్ణయించే ఒక వేదిక గా మారుతుంది అని కూడా ఐబీ అభిప్రాయ పడింది .

**2007** లో **Subrata** బోస్ అనే ఎంపీ గారు - రెంకోజీ టెంపుల్ లో వున్న నేతాజీ అస్థికలు గురించి ఎదో ఒక నిర్ణయం తీసుకోండి అంటూ - ప్రధాన మంత్రి గారి ఆఫీస్ కి ఒక లేఖ రాశారు. అప్పటి ప్రధాని మన్మోహన్ సింగ్ దీనిని గురించి ఎంక్వయిరీ చేయమని అడిగారు .

పై విషయాన్ని విచారించిన వారు " బోసు గారివిగా చెప్పబడుతున్న అస్థికలను ఏకమొత్తముగా భారత్ తీసుకోవాలని - లేదంటే తాము ఇకముందు వాటిని సంరక్షించే బాధ్య త తాము తీసుకోమని - రెంకోజీ టెంపుల్ తమకు తెలిపిందని చెప్పారు . "

పై తరువాత - ఆ అస్థికలను - టోక్యో లో వున్న భారత రాయ బార కార్యాలయంలో భద్ర పరచాలన్న - సూత్ర ప్రాయ నిర్ణయం అయ్యింది . కానీ ఇది అమలు జరగలేదు . రెంకోజీ టెంపుల్ లో వున్నవి నిజంగా

నేతాజీ గారివే అని నమ్మి- వాటిని తెచ్చి - వాటికి నివాళులు ఇవ్వటం దేనికి దారి తీస్తుందో ఎవరూ ఊహించలేక పోయారు .

**18th August 1945** తైహోకు విమానాశ్రయంలో జరిగిన విమాన ప్రమాదంలో బోసుగారు మరణించారని భారత ప్రభుత్వము ఒప్పు కున్నది . కానీ - రెంకోజీ టెంపుల్ లో వున్న అస్థికలు నేతాజీ వి అని మాత్రం ఒప్పుకోలేదు .అవి వివాద స్పదమైనవి అని నమ్మింది .నేతాజీ గారు అనేక జాతులను, సమాజాలను ప్రజలను - మొత్తముగా చరిత్రనే ప్రభావితం చేరిన వ్యక్తి కాబట్టి - అయన ఎక్కడవుండాలో అక్కడే ఉండటం మంచిది అన్న సిద్ధాంతము పెద్దలకు ఆమోదయోగ్యం అయ్యింది .వివాద స్పదమైన వాటిని భారత్ చేర్చి ఇంకో వివాదము లేవతీయటం తెలివి కల పని కాదు గదా ?

**1976,**లో రెంకోజీ టెంపుల్ పూజారి - **90** యేండ్ల వయసు వాడు అయినాడు . నేతాజీ అస్థికలను తీసుకెళ్లమని అయన తిరిగి భారత్ ని కోరాడు .అప్పుడు బయట పడ్డ విషయము ఏమిటంటే - బోసుగారు అస్థికలను సంరక్షించినందుకు గానూ రెంకోజీ టెంపుల్ పూజారి కి నెలకు **Rs 5000** చెల్లిస్తూ వున్నది . . కావాలంటే ఈ మొత్తాన్నిదాన్ని ఇంకాస్త పెంచుతాము అని భారత ప్రభుత్వము అన్నది . నేతాజీ అస్థికలను భారత్ తెచ్చి పూజించటం వల్ల అయ్యే ఖర్చుకన్నా - రెంకోజీ టెంపుల్ వారికి భత్యం పెంచటమే మంచిదని ప్రభుత్వాలు భావించాయి .

‘‘ఐబీ వారు - ఇండియన్ గవెర్నమెంట్ వారు, బోసుగారి అస్థికలను పొందటానికి వ్యతిరేకముగా వున్నారు . బోసు స్థాపించిన ఫార్వర్డ్ బ్లాక్ అనే సమస్త - బోసు కుటుంబము దీనికి అనుకూలంగా వున్నారు .

చంద్ర బోసు గారి ముని మేనల్లుడు - నేతాజీ గారి అస్థికలను జపాన్ నుండి ఇండియా తీసుకు రావాలి అంటూ **January 23** న మళ్ళీ డిమాండ్ చేశారు .

" బోసు గారి వల్లనే భారత స్వాతంత్రము సిద్ధించింది కాబట్టి - వారి అస్థికలను - **2024** లో భారత్ తీసుక వస్తామని నేటి ప్రభుత్వం ప్రకటించింది .

చివరికి అటూ ఇటూ చేసి -" నేతాజీ ఆత్మ ఎక్కడ ఉంటే తనను విడుదల చేయమని కోరదో -

అది అక్కడ ఉంటేనే మంచిది " అన్న డిప్లొమాటిక్ నిర్ణయానికి వచ్చారు . చూసారుగా - రెంకోజీ టెంపుల్ వారి సిద్ధాంతాన్ని మనవారు తెలివిగా వాడుకున్నారు .

**THE END**

నేరీసెర్చ్ మరియు విషయ సేకరణ - వారణాసి శ్రీ రామ కృష్ణ .

